


# చేనేత కబురు

ఏప్రిల్ 2003 సంచిక 2 (For private circulation Only)

మిత్రులారా,

చేనేత కబురు రెండవ సంచికకు ఆహ్వానం. చీరాలలో కాళ్లూనడానికి చిప్ *(CHIP)* ప్రయత్నిస్తున్నందు వల్ల, ఇతర అంశాల వల్ల ఈ సంచిక పంపడంలో జాప్యం జరిగింది. చేనేత కార్మికుల అవసరాలు తీర్చడానికి ప్రత్యేకమైన వనరుల కేంద్రాన్ని నెలకొల్పడం కష్టసాధ్యమైన లక్ష్యం. ఇలాంటి ప్రయత్నాలు ఇంతకు ముందు జరగలేదు. చేనేత రంగంపై సమాచారం ఒకే చోట ఏర్పాటు చేయడానికి మేం ప్రయత్నిస్తున్నాం. అలాగే చేనేత కార్మికులకు, విధాన నిర్ణేతలకు సమాచారం బట్వాడా చేస్తున్నాం. చేనేత రంగం బలాన్ని, అవసరాన్ని అంచనా వేసి ఈ రంగానికి చేయూతనివ్వడంలో సమకాలీన పరిశోధనా సంస్థలు విఫలమయ్యాయి. ఇంతకు ముందు చేనేత రంగంపై గొప్పలు చెప్పుకోవడంపై ప్రభుత్వాలు ఎక్కువ దృష్టి కేంద్రీకరించారు. ఇప్పుడు వ్యవహారం దీనికి భిన్నంగా సాగుతోంది. విధాన నిర్ణాయక రంగాలలో చేనేత రంగంపై అనేక అపోహలున్నాయి. ఈ అపోహలను సత్యం కమిటీ, వరల్డ్ బ్యాంకు సారభూతం చేశాయి. సత్యం కమిటీ ఆధికార వర్గ అహంకారంతో, ఇతరేతర దురహంకారంతో " దేశంలో చేనేత రంగం సంరక్షణ, మద్దతుతో కూడిన పరిమితుల్లో కోనసాగింది" అని చెప్పింది. కాని జరిగిందేమిటంటే దీనికి విరుద్ధంగా ప్రభుత్వ జోక్యం, రాజకీయ కుటిలత్వం చేనేత రంగాన్ని నాశనం చేసింది. ప్రభుత్వ పథకాల వల్ల మధ్య దళారుల వ్యవస్థ, దాని ప్రాతినిధ్య వ్యవస్థల అభివృద్ధికి దోహదం చేసింది. ఈ వ్యవస్థలు చేనేత రంగం వాస్తవాలు ప్రభుత్వానికి తెలియకుండా చేశాయి. ప్రభుత్వ పథకాలెన్ని ఉన్నా చేనేత కార్మికులలో పేదరికం పెరుగుతూనే ఉంది. ప్రయోగాలు, జోక్యం వల్ల స్వతంత్రమైన ఈ రంగం గత 30 ఏళ్లుగా మోకరిల్ల వలసి వచ్చింది.

పార్లమెంట్‌లో సత్యం కమిటీ సిఫార్సులను ఆమోదించమని ప్రభుత్వం హామీ ఇచ్చినప్పటికీ సత్యం కమిటీ సిఫార్సులు ఎలా అమలు అవుతున్నాయో చెప్పడానికి ఈ సంచికలో ప్రయత్నించాం. ఇటీవలి బడ్జెట్, మునుపటి బడ్జెట్ కూడా సత్యం కమిటీ సిఫార్సులు ఎలా అమలులోకి వచ్చాయో తెలియజేస్తాయి. ప్రభుత్వ విధానంలోని వైరుధ్యాలను, ద్వైదీభావాన్ని, చేనేత రంగం శ్రేయస్సు కోరేవారు తగిన స్థాయిలో ప్రస్తావిస్తారన్న ఆశ మాకు ఉంది.

డి. నర్సింహా రెడ్డి

---

## చేనేత విధానాలు, బడ్జెటు - ఏది సరైనది ?

కేంద్ర ప్రభుత్వానికి సంబంధించిన వివిధ పత్రాలను చూసిన వారెవరికైనా విటిల్లో కనిపించే అంకెలు, గణాంకాలు గందరగోళం కలిగిస్తాయి. బడ్జెట్లలో ఇంత వ్యత్యాసం ఎందుకు ఉండాలి అని సామాన్య మానవునికి ఎంతకూ అర్థం కాదు. అదే విధంగా ఈ వ్యత్యాసాలకు కారణం ఏమిటో చెప్పడానికి ఎలాంటి ప్రయత్నము జరగదు.

హ్యాండ్లూమ్ న్యూస్ మొదటి సంచికలో చేనేత రంగానికి బడ్జెట్ కేటాయింపుల్లో ఏళ్ల తరబడి బడ్జెట్ పద్దుల్లో తగ్గుదల ఎందుకు ఉందో విశ్లేషించారు. అయితే, ఆ తర్వాత జౌళి మంత్రిత్వ శాఖ వెబ్‌సైట్ లో బడ్జెట్‌పై సమాచారం ఉందని కనుగొన్నాం. ఈ ప్రణాళికల్లో చెప్పిన అంకెలకు, పార్లమెంట్‌కు సమర్పించిన బడ్జెట్ పద్దుల్లోని అంకెలకు ఎలాంటి పొంతన కుదరడంలేదు. ఈ అంశాన్ని అర్థం చేసుకోవడంలో మౌలికంగా మన స్థాయిలోనే ఇబ్బంది ఉందా లేక ఈ పత్రాలలో చూపిన లెక్కల్లో తప్పుందా ? ఒక వేళ ఇవే తప్పు అయితే చర్చకు ఇక ఆధారం ఏమిటి ? దీనికి ఎవరు బాధ్యులు ? ఈ వ్యత్యాసాలకు బాధ్యత ఎవరిది ?

పైగా క్రింది పట్టికను చూస్తే చేనేత రంగానికి కేటాయించిన నిధులను పూర్తిగా ఉపయోగించడం లేదని తెలుస్తోంది. తొమ్మిదో పంచవర్ష

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

ప్రణాళికా కాలంలో 452.50 కోట్ల రూపాయలు కేటాయిస్తే కేవలం 356.58 కోట్ల రూపాయలు మాత్రమే వెచ్చించారు. అంటే దాదాపు 23% నిధులను ఖర్చు చేయలేదు.

చివరకు వార్షిక పెట్టుబడిని కూడా పూర్తిగా వినియోగించడం లేదు. 1997-98 లో 93 కోట్ల రూపాయలు కేటాయిస్తే 81.50 కోట్ల రూపాయలు మాత్రమే ఖర్చు పెట్టారు. మొత్తం అయిదేళ్లలోనూ పరిస్థితి ఇలాగే ఉంది. అయితే, అంతుపట్టని వ్యవహారం ఏమిటంటే

| జౌళి - చేనేత కేటాయింపుల వార్షిక ప్రణాళికలు | | | |
|---|---|---|---|
| | ప్రణాళిక | | ఖర్చు |
| వివరణ | మంత్రిత్వశాఖ | బడ్జెట్ పద్దు | మంత్రిత్వశాఖ |
| 9వ ప్రణాళిక మొత్తం (1997-02) | 425.50 | | 356.58 |
| 1997-98 | 110.00 | 107.00 | 92.00 |
| 1998-99 | 93.00 | 89.80 | 81.50 |
| 1999-00 | 85.00 | 81.80 | 77.31 |
| 2000-01 | 135.00 | 112.00 | 102.64 |
| 2001-02 | 137.00 | 116.00 | 112.07 |
| 10వ ప్రణాళిక మొత్తం | 625.00 | | |
| 2002-03 | 140.00 | 117.00 | 40.96* |

* 03-01-2003 వరకు

1997-98 నుంచి 2001-02 వరకు అయిదేళ్ల పాటు వార్షిక వ్యయం 465.52 కోట్ల రూపాయలు ఉంది. అంటే ప్రణాళికలో కేటాయించిన 452.50 కోట్ల రూపాయలు కన్న 13.02 కోట్ల రూపాయలు ఎక్కువ. ఇంతకీ వాస్తవ పరిస్థితి ఏమిటి ?

వాస్తవం ఏమైనప్పటికీ చేనేత రంగానికి కేటాయించిన మొత్తాన్ని దుర్వినియోగం చేస్తున్నారని, పైగా ఈ కేటాయింపులను మరమగ్గాల రంగానికి మళ్లిస్తున్నారని చేసే వాదనలకు బలం చేకూరుతోంది. ప్రభుత్వం ఎన్ని చెప్పినా చేనేత రంగం కోసం ఉద్దేశించిన పథకాలను సవ్యంగా అమలు చేయడం లేదని రుజువు అవుతోంది.

## 2000 నూతన జౌళి విధానం - చేనేత రంగం పై సత్యం కమిటీ సిఫార్సుల నీలి నీడలు

సత్యం కమిటీ సిఫార్సులు అమలు చేయడం లేదని కేంద్ర ప్రభుత్వం పార్లమెంట్ సభ్యులకు 'హామీ' ఇచ్చినప్పటికీ వాస్తవంగా ఈ సిఫార్సులను తుచ తప్పకుండా అమలు చేస్తున్నారు.

### 1. ప్రపంచ బాంకు సిఫార్సు చేసిందేమిటి . ..

చేనేత మగ్గాలను మర మగ్గాలుగా మార్చి ఉత్పత్తి నాణ్యతను పెంచితే నేతగాళ్ల ఉత్పాదకత పెంచడానికి ఆచరణ సాధ్యమైన, సమర్థవంతమైన వ్యూహం ఏర్పడవచ్చు. మరో దారి ఏమిటంటే చేనేత రంగంలో ఉపాధి, ఆదాయ వనరులు నష్టపోతున్న వారికి శిక్షణ ఇచ్చి, నేతగాళ్లు దుస్తుల తయారీకి చేపట్టేందుకు పథకాలు చేపట్ట చేయడం.

### సత్యం కమిటీ సిఫార్సు చేసిందేమిటీ . . . .

చేనత మగ్గాల నేతగాళ్లను మరమగ్గాల నేతగాళ్లుగా మార్చడానికి ప్రభుత్వం తీవ్రంగా కృషి చేయాలి.

### ప్రభుత్వం చేసిందేమిటి . . . . .

దీన్ దయాళ్ హత్‌కార్గ ప్రోత్సాహన్ యోజనను ప్రారంభించి మరమగ్గాల నేతగాళ్లకు మరిన్ని ప్రోత్సాహకాలు ఇచ్చింది.

### 2. ప్రపంచ బాంకు ఏం భావిస్తోంది . . . .

ఉపాధి అవకాశాలను కల్పించి గ్రామీణ పేదరికాన్ని పారదోలే లక్ష్యంతో చేపట్టిన సామాజిక లక్ష్యాన్ని నిర్వహణకు అనువైన ఆర్థిక విధానాల కింద మార్చడం వల్లనే భారత్‌లోని 3.6 మిలియన్ల చేనేత మగ్గాలను రక్షించడం సాధ్యం. ఈ విధానాల వల్ల అంచనా వేసిన 6.7 మిలియన్ల మంది కన్న మరింత ఎక్కువ మందికి ప్రయోజనం కలుగుతుంది. వీరి మగ్గాలు ప్రధానంగా గ్రామీణ ప్రాంతాలలోని వారి వస్త్రాల అవసరాలు తీరుస్తాయి. అలాగే వీరు అనేక ప్రాంతాలలో ప్రత్యేక రకం చీరల తయారీలో నైపుణ్యం సాధించారు.

### సత్యం కమిటీ ఏం భావించింది . . . .

దశల వారీగా అంటే 1999-2000 నుంచి ఏటా 20% మేర సబ్సిడీలను తగ్గించాలని సూచించింది.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

### ప్రభుత్వం ఏం చేసింది. . . . .

బడ్జెట్ కేటాయింపులను తగ్గించడం, ప్రత్యేక సబ్సిడీలను ఉపసంహరించడం. "పదో పంచవర్ష ప్రణాళికా కాలంలో కేంద్ర సహాయాన్ని ఏటా 20 శాతం వంతున తగ్గిస్తారు".

### సత్యం కమిటీ సిఫార్సు చేసింది ఏమిటి. . . . .

చేనేత రిజర్వేషన్ చట్టాన్ని క్రమంగా ఉపసంహరించడం.

### ప్రభుత్వం చేసిందేమిటి. . . . . .

రిజర్వు చేసిన 22 వస్తువులను 11కు తగ్గించడం. అమలు చేయడానికి ఉద్దేశించిన నిధులను తగ్గించడం, నిధులు వెచ్చించడంలో నిర్లక్ష్యం.

"26-07-1996 నాటి ఉత్తర్వు, 02-06-1999, 25-04-2000 నాటి సవరణల ప్రకారం పదకొండు రకాల వస్త్రాలను ప్రస్తుతానికి చేనేత రంగంలో ఉత్పత్తి చేయడానికి ప్రత్యేకించారు".

చేనేత రంగానికి సంబంధించినంత వరకు గత మూడేళ్లుగా ప్రభుత్వ ధోరణి, విధానాలు సత్యం కమిటీ సిఫార్సుల మీదే ఆధారపడ్డాయి. చేనేత రంగంపై తమ శ్రద్ధ కొనసాగుతోందని ప్రభుత్వం ప్రకటించినా వివిధ ప్రభుత్వ పథకాలు, బడ్జెట్ కేటాయింపులు స్పష్టంగా మరమగ్గాలకు, మిల్లు రంగాలకు అనుకూలంగానే ఉన్నాయి. 2005 కోటాలు లేని మార్కెట్‌లో అంతర్జాతీయ పోటీ ఎదుర్కోవడానికి 'మొత్తం రంగాన్ని పటిష్టం' చేసే ఉద్దేశ్యంతో జౌళి విధానాన్ని, భారత్‌లో జౌళి పరిశ్రమను హేతుబద్ధం చేసే క్రమంలో ప్రభుత్వం ఉద్దేశ పూర్వకంగా సంక్షేమ పథకాలను ఉపసంహరించే విధానాలను అమలు చేసింది. బడ్జెట్ కేటాయింపులను తగ్గించింది. మరమగ్గాలను చురుకుగా ప్రోత్సహించింది. అదే సమయంలో ఈ విషయాన్ని ధైర్యంగా చెప్పడానికి ప్రభుత్వం జంకుతుంది. మిల్లు రంగం, మరమగ్గాల అక్రమ ప్రవర్తన, విధానాలను అమలు చేసే యంత్రాంగంలో అలసత్వం, సహకార సంఘాలలో ప్రభుత్వ జోక్యం, అవినీతి వల్ల చేనేత రంగం సంక్షోభంలో కూరుకు పోయిందని ప్రతి అంచనా రుజువు చేస్తోంది. దుస్తుల పార్కులు, సాంకేతిక అభివృద్ధి నిధులు, రుణ పథకాలు, ముతక నూలు మొదలైన వాటిపై కేంద్ర ఎక్సైజ్ సుంకం మొదలైనవన్ని చేనేత రంగం ప్రయోజనాలను దెబ్బతీస్తాయి. ఈ పథకాల ద్వారా 2005 లో పోటీని మరమగ్గాలు, మిల్లు రంగం తట్టుకుంటాయో లేదో తెలియదు. కానీ డబ్లు.టి.ఓ. బూచిని చూపించి ఈ రంగాలు నిధులు సంపాదిస్తున్నాయి. చేనేత రంగాన్ని దెబ్బతీసే విధానాలను అమలు చేస్తున్నాయి.

అనేక మరమగ్గాల ఉత్పత్తులు చేనేత రంగాల ఉత్పత్తులకు ఉండే గిరాకీ పై ఆధారపడి ఉంటాయన్న వాస్తవం నుంచి ప్రభుత్వం దృష్టిని మరల్చడానికి మరమగ్గాల రంగం విజయవంతంగా కృషి చేసింది. మరమగ్గాల, చేనేత మగ్గాల ఉత్పత్తుల మధ్య ఉన్న తేడాను చెరిపి వేయడానికి పని గట్టుకొని కృషి చేశారు. ఇతర ఉత్పత్తులను చేనేత ఉత్పత్తులుగా చెలామణి చేశారు. సత్యం కమిటీ, ప్రపంచ బ్యాంకు, ప్రభుత్వం చేనేత రంగం ఉత్పత్తుల సంప్రదాయాన్ని, నైపుణ్యాన్ని, నాజుకుతనాన్ని, కీర్తిస్తూనే ఈ ఉత్పత్తులను చౌకబారు అనుకరణలనుంచి, తప్పుడు ప్రకటనల నుంచి పరిరక్షించడానికి చేసిందేమీ లేదు.

---

## జౌళి, అనుబంధ రంగంలో ఉపాధి, భారత ప్రభుత్వం

క్రింది పట్టికను బట్టి మొత్తం జౌళి రంగంలో కెల్లా చేనేత రంగంలో లభించే ఉపాధి అవకాశాలు ఎక్కువ అని రుజువు అవుతుంది. నిజానికి ఈ అవకాశాలు పెరుగుతున్నాయి. వాస్తవం ఇలా ఉండగా ప్రభుత్వం ఈ ఉపాధి అవకాశాలను పరిరక్షించడంలో విఫలమైంది. దీనికి ప్రత్యామ్నాయం ఏమిటంటే ప్రభుత్వం తగిన ఉపాధి అవకాశాలను కల్పించడమే. ఇతర గ్రామీణ రంగాలలో నిరుద్యోగం పెరగడం, చేనేత ఉత్పత్తులకు గిరాకీ పెరగడం వల్ల చేనేత రంగంలో ఉపాధి అవకాశాలు పెరుగుతున్నాయి. ఆ రకంగా చూస్తే పని ఉంది, మార్కెట్ కూడా ఉంది. సబ్సిడీల రూపంలో భారీ పెట్టుబడి పెట్టకుండానే ప్రధమంగా ప్రభుత్వం చేయవలసింది ఏమిటంటే ఈ ఉపాధి అవకాశాలను పరిరక్షించడం. చేనేత రంగంలో 12 మిలియన్ల మందికి ఉపాధి దొరుకుతోంది. ఆ తర్వాత అధికంగా 4.25 మిలియన్ల మందికి వికేంద్రీకృత మరమగ్గాల రంగంలోనే ఉపాధి అవకాశాలున్నాయి. రెడీమేడ్ దుస్తుల తయారీలో ఉపాధి అవకాశాలు త్వరితగతిన పెరుగుతున్నాయి. ఈ రంగంలో ఇప్పుడు 6.80 మిలియన్ల మందికి ఉపాధి దొరుకుతోంది. ప్రభుత్వం దృష్టి అంతా అతి తక్కువ ఉపాధి అవకాశాలు కల్పించే రంగాలపైనే ఉంది. ప్రపంచీకరణ అంటే దేశంలో మరింత నిరుద్యోగం అనుకుంటే ఇదే బ్రహ్మాండమైన ఉదాహరణ.

| క్రమ సంఖ్య | రంగం / పరిశ్రమ | ఉపాధి (మిలియన్లలో) | | |
|---|---|---|---|---|
| | | మార్చి 2001 నాటికి (అంచనా) | పదో ప్రణాళిక చివరి ఏడాది వరకు అంచనా | పెరుగుదల |
| I | జౌళి రంగం | | | |
| 1 | నూలు/కృత్రిమ నార/నూలు జౌళి/ మిల్లు రంగం (ఎస్.ఎస్.ఐ, స్పిన్నింగ్ ప్రత్యేక నేత విభాగాలు) | 1.07 | 1.10 | 0.03 |
| 2. | మానవుడు చేసిన నార/ఫిలమెంట్ యార్న్ పరిశ్రమ (అల్లిక పరిశ్రమతో సహా) | 0.11 | 0.20 | 0.09 |
| 3 | వికేంద్రీకృత మరమగ్గాల రంగం | 4.15 | 4.25 | 0.10 |
| 4. | చేనేత రంగం | 12.00 | 12.40 | 0.40 |
| 5. | అల్లిక రంగం | 0.30 | 0.50 | 0.20 |
| 6. | ప్రాసెసింగ్ రంగం | 0.24 | 0.30 | 0.06 |
| 7. | ఉన్ని రంగం | 1.20 | 1.30 | 0.10 |
| 8. | రెడిమేడ్ దుస్తుల రంగం (అల్లిక దుస్తుల రంగంతో సహా) | 3.54 | 6.80 | 3.26 |
| 9. | పట్టు పరిశ్రమ | 5.57 | 6.03 | 0.46 |
| 10. | చేతి వృత్తుల రంగం | 5.84 | 6.77 | 0.93 |
| 11 | జనపనార పరిశ్రమ<br>1. వ్యవస్థీకృత జనపనార పరిశ్రమ<br>2. అవ్యవస్థీకృత జనపనార పరిశ్రమ | 0.20<br>0.20 | 0.20<br>0.30 | 0.00<br>0.10 |
| | మొత్తం | 34.42 | 40.15 | 5.73 |

## పార్లమెంటరీ స్థాయి సంఘం నివేదికలోని అంశాలు (ఏప్రిల్‌లో పార్లమెంట్‌లో ప్రవేశ పెట్టిన 48 వ నివేదిక)

"బి. ఇ. 2000–2001 తో పోలిస్తే చేనేత సబ్సిడీలను 40 శాతానికి తగ్గించారు. చేనేత కార్మికుల కోసం ఉద్దేశించిన ప్రాజెక్ట్ ప్యాకేజి పథకం కోసం బి. ఇ. 2000–2001 లో 20 కోట్ల రూపాయల ప్రణాళిక కేటాయింపులు చేశారు. ఆర్.ఇ. 2000–2001 లో దీనిని 12.30 కోట్ల రూపాయలుగా సవరించారు. కాని బి. ఇ. 2001–2002 లో ఈ పథకం కోసం నిర్ధిష్టమైన ప్రణాళిక కేటాయింపులు ఏమి చేయలేదు. నిజానికి ఈ పథకంలోని ముఖ్యాంశాలను దీన్ దయాళ్ హత్‌కార్గ ప్రోత్సాహన్ యోజన వంటి వాటిలో కలిపేశారు. బి. ఇ. 2000–2001 దీన్ దయాళ్ హత్‌కార్గ ప్రోత్సాహన్ యోజనకు 66 కోట్ల రూపాయల ప్రణాళికా కేటాయింపుల నిధులు అందాయి. బి. ఇ. 2001–2002 లో ఈ కేటాయింపులు దాదాపు 26 కోట్ల రూపాయల మేర పెరిగాయి. చేనేత రంగానికి కేంద్ర ప్రభుత్వం కల్పించిన పథకాలు, ముఖ్యంగా చేనేత కార్మికులకు వర్క్‌షెడ్, గృహ నిర్మాణ పథకాల క్రింద నిధులు, చేనేతకు సహాయం, నేత కార్మికుల సంక్షేమ పథకాలకు నిధులు బి. ఇ. 2001–2002 లో ఒక్కొక్క దానికి కోటి రూపాయల మేర తగ్గాయి.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

బి. ఇ. 2001-2002 లో ఈశాన్య ప్రాంతం, సిక్కింలో ప్రణాళికా కేటాయింపులు భారీగా తగ్గాయి. బి. ఇ. 2001-2002 లో ఈశాన్య ప్రాంతం, సిక్కింకు ఎలాంటి ప్రణాళికా కేటాయింపులు లేవు. బి. ఇ. 2000-2001 లో ప్రణాళికా పథకాల కింద 21 కోట్ల రూపాయలు కేటాయించారు.

చేనేత కార్మికుల సంక్షేమానికి ప్రణాళికా కేటాయింపులు తగ్గించకూడదని కమిటీ భావిస్తోంది. నేత కార్మికుల సంక్షేమానికి ఎక్కువ బాధ్యత తీసుకునేటట్టు రాష్ట్రాలకు కూడా నచ్చ చెప్పాలి.

ఆర్థిక సరళీకరణ నెపంతో 65 లక్షల మంది ప్రయోజనాలు వమ్ము కాకూడదని కమిటీ భావిస్తోంది. అమలులో ఉన్న సంక్షేమ పథకాలు చాలా వరకు సహకార సంఘాల పరిధిలో ఉన్న వారికే వర్తిస్తున్నాయి. కాబట్టి చేనేత కార్మికులను సహకార రంగం పరిధిలోకి తీసుకురావడానికి మంత్రిత్వ శాఖ ఒక వ్యూహాన్ని రూపొందించాలి. ఈ లక్ష్యం సాధించడం కోసం చేనేత కార్మికుల కోసం ఉద్దేశించిన వర్క్‌షెడ్ , గృహ నిర్మాణం పథకాన్ని ప్రచారంలో పెట్టడానికి కృత నిశ్చయంతో ప్రయత్నించాలి. పట్టణాలకు దగ్గరగా ఉండే ప్రాంతాలలో ఉండే చేనేత కార్మికులకు వర్క్‌షెడ్‌లు, గృహాలు కల్పించడం కోసం కేటాయింపులను గణనీయంగా పెంచాలి. నాణ్యత, ఉత్పాదకతలో ఇతరులతో పోటీ పడడానికి వీలుగా వారికి అందుబాటులో ఉన్న వర్క్‌షెడ్‌లను ఆధునీకరించడానికి సహకార గృహ నిర్మాణాన్ని కూడా ప్రోత్సహించాలి.

అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగించడానికి వీలుగా చేనేత రంగంలో ప్రభుత్వం క్రియాశీల పాత్ర నిర్వహించాలి. 40వ, 43వ నివేదికలలో సిఫార్సు చేసినట్టుగా నూలు రిజర్వేషన్ దామాషాను పెంచడానికి, మొత్తం జౌళి ఉత్పత్తుల్లో చేనేత రంగం వాటాను నిర్ధారించడానికి ప్రభుత్వం కృషి చేయాలని కమిటీ పునరుద్ఘాటిస్తోంది. సంక్షేమ రాజ్యంలో రాజ్యం వాణిజ్య ప్రయోజనాలు ఉత్కృష్టంగానే ఉండాలి. సామన్య ప్రజల జీవనంలో గుణాత్మక మార్పులు తీసుకురావడం ప్రభుత్వం బాధ్యత.

దీనికి తోడు చేనేత (ఉత్పత్తికి వస్తువులు రిజర్వేషన్) చట్టం 1985 ప్రకారం జారీ చేసిన చిలప నూలు బాధ్యత ఉత్తర్వు, రిజర్వేషన్ ఉత్తర్వుల ప్రకారం చేనేత రంగాన్ని తగినంతగా పరిరక్షించాలి. ఈ చర్యల అమలుకు చాలా చేయాల్సి ఉంది. అందుకని 2000 నాటి నూతన జౌళి విధానం పై చర్యలను చేనేత కార్మికులకు నష్టం కలిగించే రీతిలో సమీక్షించ కూడదని కమిటీ గట్టిగా సిఫార్సు చేస్తోంది. నూతన స్ఫూర్తిని, చేనేత కార్మికుల అవకాశాలు మెరుగు పరచడానికి ఉపకరించే ఏ సమీక్ష అయినా ఆహ్వానించదగిందే. ఏ సమీక్షకైనా అట్టడుగు స్థాయిలోని చేనేత కార్మికుల అవసరాలే ప్రధానం కావాలి. (పారా 8.3)

కేవలం ఎగుమతుల మీదే చేనేత భవిష్యత్తు ఆధారపడి ఉన్నదని కమిటీ భావించడం లేదు. అందువల్ల స్వదేశీ మార్కెట్ లో చేనేత ఉత్పత్తుల అమ్మకాలను ప్రోత్సహించడంతో పాటు ఎగుమతులను పెంపొందించడానికి ప్రభుత్వం వ్యూహం రూపొందించాలి.

చేనేత కార్మికుల సహాయం కోసం కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన పథకం కోసం ప్రణాళికా కేటాయింపులో 5 కోట్ల రూపాయలు అందుతున్నాయి. బి. ఇ. 2000-2001 లో ఈ కేటాయింపులు 6 కోట్ల రూపాయల మేర ఉండేవి. అంటే బి. ఇ. 2001-2002 లో కోటి రూపాయాల కోత విధించారు(బి.ఇ. అంటే బిజినెస్ ఇయర్).

చేనేత కార్మికుల సంక్షేమ పథకానికి నిధుల్లో కోత పెట్టాల్సింది కాదు. సరళీకరణ శక్తుల దాడి నుంచి చేనేత కార్మికులను పరిరక్షించడానికి ఈ సంక్షేమ పథకాన్ని సక్రమంగా అమలు చేయడానికి మంత్రిత్వశాఖ కృషిచేయాలి. బడ్జెట్ వనరులు కేటాయించేటప్పుడు అర్థవంతమైన పథకాలు కొనసాగించడమే ప్రమాణంగా ఉండాలి. చేనేత కార్మికుల జీవితాలను నేరుగా ప్రభావితం చేసే అంశాలపై ఎక్కువ శ్రద్ధ కనబర్చాలి. 43 వ నివేదికలో సిఫార్సు చేసినట్టుగా చేనేత కార్మికుల జీవితాల్లో గుణాత్మక మార్పు తీసుకురావడం పై శ్రద్ధ తీసుకోవాలన్న అంశాన్ని కమిటీ పునరుద్ఘాటిస్తోంది".

---

ఈ నివేదిక, సిఫార్సులు ఉన్నప్పటికి చేనేత రంగానికి బడ్జెట్ కేటాయింపులు తగ్గుతున్నాయి. మొదటి సంచికలో చెప్పిన అంశాలకు తోడుగా ఈ అంశంపై తజా పరిస్థితిని తెలియజేస్తున్నాం.

**చేనేత సబ్సిడీ** 2001-2002 బడ్జెట్‌లో సబ్సిడీలను మరో 23 శాతం తగ్గించారు. 2000-01 లో 27 కోట్ల రూపాయలు ఉంటే 2001-02 లో దీనిని 21 కోట్ల రూపాయలకు తగ్గించారు. ఆ తర్వాత ఈ 21 కోట్ల కేటాయింపును 10.95 కోట్లుగా సవరించారు. 2002-03 బడ్జెట్‌లో దీనిని 11 కోట్లకు అంటే 50 శాతానికి తగ్గించారు. ఈ కేటాయింపులను సైతం 5.29 కోట్ల రూపాయలుగా సవరించారు. 2003-04 లో కేటాయింపులు 5.50 కోట్ల మేరకే ఉన్నాయి. దీనిని మరింత తగ్గిస్తారేమో చూడాలి.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

**<u>చేనేత కార్మికులకు ప్రాజెక్ట్ ప్యాకేజి పథకాలు</u>** ఈ పథకానికి 2000–01లో బడ్జెట్ కేటాయింపు 20 కోట్ల రూపాయలు ఉంటే దీనిని 12.30 కోట్ల రూపాయలకు సవరించారు. 2001–02 లో ఈ పద్దు కింద కేటాయింపులే లేవు. ఈ పథకాన్ని దీన్ దయాళ్ హత్‌కార్గ ప్రోత్సాహన్ యోజన లో మిళితం చేశామని చెప్పారు.

**<u>దీన్ దయాళ్ హత్‌కార్గ ప్రోత్సాహన్ యోజన</u>** ఈ కొత్త పథకాన్ని 2000–01 లో 40 కోట్ల రూపాయల కేటాయింపుతో ప్రారంభించారు. ఈ కేటాయింపులను తర్వాత 20 కోట్ల రూపాయలకు తగ్గించారు. 2001–02 లో 66 కోట్ల రూపాయలు కేటాయించి దానిని 48.55 కోట్లకు సవరించారు. 2002–03 లో 65 కోట్ల రూపాయలు కేటాయించి మళ్లీ 52.50 కోట్ల రూపాయలకు తగ్గించారు. అమలు సరిగ్గా జరిగి ఉంటే ఈ ఎగుడు దిగుళ్ల అవసరమే ఉండేది కాదు.

**<u>సత్వర అభివృద్ధి పథకం, ఎగుమతుల ప్రోత్సహా పథకం</u>** **ఈ పథకం కోసం 2000-01 లో 4.50 కోట్ల రూపాయలు కేటాయించి దానిని 4.95 కోట్లకు సవరించారు. 2001-02 లో ఈ కేటాయింపు 6.25 కోట్ల రూపాయలకు పెరిగింది. ఆ తర్వాత సంవత్సరాలలో కేటాయింపులే లేవు.**

**<u>మార్కెటింగ్ సముదాయం, నూలు సేకరణ సహాయక పథకం</u>** 2000–01 లో ఈ పథకానికి 4 కోట్ల రూపాయలు అందాయి. దీనిని 4.40 కోట్లుగా సవరించారు. 2001–02 లో ఈ కేటాయింపును 7 కోట్ల రూపాయలకు పెంచారు. ఆ తర్వాత ఎలాంటి కేటాయింపులూ లేవు.

**<u>నేతగాళ్ల సేవా కేంద్రం</u>** ఈ పథకం కింద 2000–01 లో 13.94 కోట్ల రూపాయలు కేటాయించి మళ్లీ 14.30 కోట్ల రూపాయలకు పెంచారు. 2001–02లో 16.10 కోట్ల రూపాయలు కేటాయించి 16.16 కోట్ల రూపాయలకు పెంచారు. 2002–03లో ఈ కేటాయింపు 15.30 కోట్ల రూపాయలకు తగ్గించి మళ్లీ 15.44 కోట్ల రూపాయలకు పెంచారు. 2003–04 లో ఈ కేటాయింపు 16 కోట్ల రూపాయలకు పెరిగింది.

**<u>చేనేత ఎగుమతుల అభివృద్ధి పథకం</u>** 2000–01 లో ఈ పథకం కోసం 4 కోట్ల రూపాయలు కేటాయించారు. 2001–02 లో దీనిని 5 కోట్ల రూపాయలకు పెంచారు. అదే సంవత్సరం దీనిని 3.5 కోట్ల రూపాయలుగా సవరించారు. 2002–03 లో 5 కోట్ల రూపాయలు కేటాయించి తర్వాత మూడు కోట్ల రూపాయలకు తగ్గించారు. 2003–04 లో 4.50 కోట్ల రూపాయల బడ్జెట్ కేటాయించారు.

ఈ రకంగా జౌళి బడ్జెట్‌లో చేనేత రంగానికి కేటాయింపులు ప్రతి ఏటా తగ్గుతున్నాయి. 1997–98 నుంచి 2002–03 మధ్య ఈ కేటాయింపులు 203.50 కోట్ల రూపాయల నుంచి 152.83 కోట్ల రూపాయల వరకు తగ్గాయి. 2002–03 నుంచి సవరించిన బడ్జెట్ ప్రకారం ఈ కేటాయింపులు స్వల్పంగా 212.40 కోట్ల రూపాయలకు పెరిగాయి. ఇది మళ్లీ 255.68 కోట్ల రూపాయలకు పెరిగింది.

చిలపల నూలుపై ఎక్సైజ్ సుంకం విధించడం ( రూ. 75 కోట్లు, 2003–04 లో ప్రవేశ పెట్టారు) వల్ల CENVAT కింద వాపసు ఇవ్వడం, మిల్ గేట్ ధరల పథకం (రూ. 8 కోట్లు. 2002–03లో ప్రవేశ పెట్టారు), మార్కెట్ ప్రోత్సహక పథకం (రూ. 7 కోట్లు. 2002–03లో ప్రవేశ పెట్టారు), డిజైన్ల అభివృద్ధి శిక్షణా పథకం (రూ. 9.4 కోట్లు. 2002–03లో, రూ. 34.96 కోట్లు 2003–04 లో) వంటి కొత్త పథకాల కారణంగా ఈ పెరుగుదల కనిపిస్తోంది.

1997–98 నుంచి 2001–02 వరకు సవరించిన కేటాయింపులను పరిశీలిస్తే పార్లమెంట్ ఆమోదించిన కేటాయింపుల కన్న నికర వ్యయం చాలా తక్కువగా ఉన్నట్లు తేలుతుంది. ఈ తగ్గుదల 174.76 కోట్ల రూపాయల నుంచి 152.83 కోట్ల రూపాయల వరకు ఉంది.

సామాన్యులకు ఈ సవరించిన బడ్జెట్ల ఆంతర్యం ఏమిటో, సవరించిన బడ్జెట్లు మొదట చేసిన కేటాయింపుల కన్న ఎందుకు తక్కువగా ఉంటాయో ఎంతకూ అంతు బట్టదు.

అయితే కొత్త పథకాలు ప్రత్యక్షంగా కానీ, పరోక్షంగా గానీ చేనేత రంగానికి ఏ రకంగానూ సహాయపడవు. CENVAT తో ముడిపడ్డ ఎక్సైజ్ సుంకం చేనేత కార్మికులకు ఏ రకంగానూ సహాయకారి కాక పోగా అది వారికి అవరోధంగా ఉంది. డిజైన్, శిక్షణ పథకాల క్రింద చేసిన కేటాయింపులు బహుశా NIFT ఇతర ఫ్యాషన్ సంస్థల కోసం చేసింది కావచ్చు. గత మూడేళ్ల బడ్జెట్ కేటాయింపులను పరిశీలిస్తే సత్యం కమిటీ సిఫార్సులు అమలు అవుతున్నట్లు స్పష్టంగా కనిపిస్తోంది. ఏటా 20 శాతం చొప్పున సబ్సిడీలను ఉపసంహరిస్తున్నారు. పథకాలను మారుస్తున్నారు.

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

## పటం : నూలు వస్త్రాల పరిశ్రమ నిర్మాణం

ఎగుమతి

స్వదేశీ మార్కెట్

ఉత్పత్తిదార్లు : వస్త్రాల మరియు ఇతర జౌళి ఉత్పత్తులు

తయారీ కేంద్రం : యంత్ర చాలిత, రంగుల అద్దకం, ప్రింటింగ్, ఫినిషింగ్

తయారీ కేంద్రం : చేతితో చేసినవి, అద్దకం ప్రింటింగ్, ఫినిషింగ్

(నూలు అద్దకం గుడ్డ)

( గ్రే క్లాత్ )

( గ్రే క్లాత్ )

మర మగ్గాలు

అల్లకం

చేనేత

మిశ్రమ మిల్లులు (స్పిన్నింగ్, వీవింగ్, ప్రింటింగ్, ఫినిషింగ్)

యంత్రాల ద్వారా అద్దకం విభాగాలు

చేతి అద్దకం విభాగాలు

(కండె నూలు)

(చిలపల నూలు)

ఎగుమతి

స్పిన్నింగ్ మిల్లులు

పత్తి గింజలు

(లేత రంగు పత్తి)

జిన్నింగ్ మిల్లులు

రైతులు (విత్తనపు పత్తి)

"అవ్యవస్థీకృత రంగం"

ఆధారం: ఇండియా: కాటన్ అండ్ టెక్స్టైల్ రిఫార్మింగ్ టు కంపీట్, వాల్యూమ్ 2, అనెక్సెస్, జనవరి 14, 1999.
గ్రామీణాభివృద్ధి రంగ విభాగం, దక్షిణాసియా ప్రాంతం, ప్రపంచ బ్యాంకు పత్రం

Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support

## నేత కార్మికుల పరిస్థితి పెరుగుతున్న పేదరికం

పొందూరు శ్రీకాకుళం జిల్లాలోని ఓ గ్రామం. మనం ఒక్కసారి పొందూరు, సిరిసిల్ల, పోచంపల్లి వెళితే చేనేత కార్మికులు ఎందుకు ఆత్మహత్యలు చేసుకుంటారో అర్థం అవుతుంది. పొందూరు ఖద్దరు చాలా ప్రఖ్యాతి గాంచింది. మహాత్మగాంధీ కూడా దీనిని మెచ్చుకున్నారు. నేడు ఈ ప్రఖ్యాత నేతగాళ్లు జీవన్మరణ పోరాటం సాగిస్తున్నారు. అదే రకంగా పోచంపల్లి టై అండ్ డై చేనేత ఉత్పత్తులకు ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. కానీ ఈ రకం ఉత్పత్తులు చౌక ధరలకు నకిలీ సరుకులు తయారు చేసే వారి నుంచి విపరీతమైన పోటీ ఎదుర్కుంటున్నారు.

ఆంధ్ర ప్రదేశ్‌లోనే ఏడు లక్షల మంది చేనేత రంగంపై ఆధారపడి ఉన్నారు. అనేక కుటుంబాలు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నయి. ఈ రంగాన్ని ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తోంది అనడానికి ఇదే నిదర్శనం. పైగా మరమగ్గాల పెరుగుదల చేనేత మగ్గాలపై దుష్ప్రభావం కలగ జేస్తుంది. నిజానికి చేనేత డిజైన్లను మరమగ్గాలు అనుకరిస్తున్నాయి. ఈ డిజైన్లను ఉపయోగించి మరమగ్గాలు తక్కువ ధరకు వస్త్రాలు ఉత్పత్తి చేస్తున్నాయి. దీనికి తోడు ప్రభుత్వం మరమగ్గాలకు సబ్సిడీ అందజేస్తుంది. ప్రభుత్వం మరమగ్గాలను ప్రోత్సహిస్తుంటే దాని ప్రభావం చేనేత మగ్గాలపై ఉండదా ? ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేనేత రంగానికి బడ్జెటు కేటాయింపులు తగ్గించడమే కాకుండా చేనేత రంగానికి కేంద్ర ప్రభుత్వం కేటాయించిన నిధులను మరమగ్గాల రంగానికి మళ్లిస్తోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండూ తమ ధోరణిలో పక్షపాతాన్ని ప్రదర్శిస్తున్నాయి. పక్షపాతంతో కూడిన ప్రభుత్వ విధానాల వల్ల చేనేత కార్మికుల జీవితాలు దుర్భరంగా తయారయ్యాయి.

ఉదాహరణకు కృష్ణా జిల్లా పెడనకు చెందిన చేనేత కార్మికుడైన ఉమ్మిటి కోటి నాగేశ్వరరావు, ఆయన భార్య ఉషా కుమారి బతుకుదెరువు కోసం 30 ఏళ్ల కిందట ఒంగోలు జిల్లా దేశాయి పేట గ్రామానికి వలస వెళ్లారు. అప్పటి నుంచి వారు రోజు వారీ కూలీ చేస్తూ చాలీచాలని బతుకులీడుస్తున్నారు. వారికి ఇద్దరు కుమారులు ఒక కూతురు ఉన్నారు. వారిలో పెద్ద కొడుకు ఉమ్మిటి శివదుర్గా ప్రసాద్ చిన్నప్పటి నుంచి చదువుపై అమితమైన ఆసక్తి చూపించేవాడు. దంతంపేటలో స్థానిక ప్రాథమిక పాఠశాలలో అతని ప్రాథమిక విద్య పూర్తి చేశాడు. అతనికి చదువు మీద శ్రద్ధ ఉన్నా, అతని కుటుంబం చదువు చెప్పించలేక పోయింది. వారి పరిస్థితిని అర్థం చేసుకున్న హెడ్ మాస్టర్ తులసీ ప్రసాద్ వారి కుమారుని గురుకుల పాఠశాలలో చేర్పించాలని సలహా ఇచ్చారు. ఎందుకంటే అక్కడ విద్య ఉచితం. ఈ సలహా మేరకు అయిదో తరగతి పూర్తయిన తర్వాత దుర్గా ప్రసాద్ గురుకుల పాఠశాల ప్రవేశ పరీక్ష రాశాడు. ఈ పరీక్షలో అతను అద్భుత విజయం సాధించాడు. ఆ రకంగా అతనికి నెల్లూరు జిల్లా కోటలోని గురుకుల పాఠశాల లో ఆరు నుంచి పదో తరగతి వరకు చదవడానికి అవకాశం వచ్చింది. ప్రతి ఏటా ప్రతిభను కనబరుస్తూ పదో తరగతిలో మొత్తం 600 మార్కులకు 572 మార్కులు సంపాదించాడు. అయితే అతని తండ్రి పై చదువులకు పంపలేకపోయాడు. నిజానికి ఆ కుటుంబానికి రెండు పూటలా తిండికే అవకాశం లేదు. ఈ పరిస్థితి తెలిసిన కొన్ని రెసిడెన్షియల్ జూనియర్ కళాశాలలు అతను ఇంటర్మీడియట్ పూర్తి చేయడానికి ఫీజు మాఫీ చేయడానికి ముందుకు వచ్చాయి. ఈ అవకాశం ఉన్నప్పటికీ ఆ కుటుంబానికి అతనికి పుస్తకాలు, బట్టలు ఇప్పించే స్థితిలో లేదు. అందువలన అచ్చులు అతకటం, ఇచ్చెలు తోడటం, కండెలు చుట్టడం లాంటి పనులు చేసి డబ్బు సంపాదించాలని దుర్గా ప్రసాద్ భావించాడు. రెండో కొడుకు అతికష్టం మీద ఎనిమిదో తరగతి వరకు చదివాడు ఆ తర్వాత మళ్లీ పనిలో చేరాల్సి వచ్చింది. ఈ పిల్లల తల్లి, చెల్లి కలిసి అదనపు ఆదాయం కోసం ఒక టిఫిన్ సెంటర్ ప్రారంభించారు. ఆ రకంగా ఈ కుటుంబం బతుకు పోరు కొనసాగిస్తోంది. తమ పిల్లల భవిష్యత్తును మెరుగుపరచలేక సతమత మవుతోంది.

ఇక్కడ తప్పెవరిది ? ప్రభుత్వం చేనేత కార్మికుల పిల్లలకు విద్యను కొనసాగించడానికి మద్దతు ఇవ్వడానికి నిరాకరించడం వల్ల ప్రతిభ గల ఒక విద్యార్థి చదువుకునే అవకాశం పోగొట్టుకున్నాడు. అయినా బాల కార్మిక వ్యవస్థ నిర్మూలనపై పేదరిక నిర్మూలన కార్యక్రమాలపై వాగాడంబరానికి లోటు లేదు.

---

మీ సలహాలు, సూచనలు మాకు పంపండి.



Brought out by Centre for Resource Education (CRE), Plot No.9, Brig. Thyagraj Colony, Near AOC Gate, Secunderabad, for Centre for Handloom Information and Policy Advocacy (CHIP), 16-70 (F), Ramakrishnapuram, Chirala 523 155, with Oxfam GB(India) support